# అథ ద్వావింశో%ధ్యాయః

## సన్న్యాసులకు పదకొండవనాడు చేయవలసిన కృత్యము

శ్రీసుబ్రహ్మణ్య ఉవాచ |

ఏకాదశే %హ్ని సంప్రాప్తే యో విధిస్సముదాహృతః | తం వక్ష్యే మునిశార్దూల యతీనాం స్నేహతస్తవ || 1

సమ్మార్జ్య వేదీమాలిప్య కృత్వా పుణ్యాహవాచనమ్ | ప్రోక్ష్య పశ్చిమమారభ్య పూర్వాంతం పంచ చ క్రమాత్ || 2

మండలాన్యుత్తరాశస్యః కుర్యాత్స్వయమవస్థితః | ప్రాదేశమాత్రం సంకల్ప్య చతురస్రం చ మధ్యతః || 3

బిందుత్రికోణషట్కోణవృత్తాకారాణి చ క్రమాత్ | శంఖం చ పురతః స్థాప్య పూజోక్తక్రమమార్గతః || 4

ప్రాణానాయమ్య సంకల్ప్య పూజయిత్వా సురేశ్వరీః | దేవతాః పంచ పూర్వోక్తా అతివాహికరూపిణీ ః || 5

సంత్యజ్యోత్తరతో దర్భాన్ యశ్చ సంస్పృశ##తే తతః | పశ్చిమాది సమారభ్య షడుత్థాపనమార్గతః || 6

మండలాని చ తేష్వంతః పుష్పాణ్యాధాయ పీఠవత్ | ఓం హ్రీమిత్యుక్త్వాగ్నిరూపాం తామతివాహికదేవతామ్ || 7

ఆవాహయామి నమ ఇత్యంతం సర్వత్ర భావయేత్ | దర్శయేత్ స్థాపనాద్యాస్తు ముద్రాః ప్రత్యేకమాదరాత్ || 8

ఓ మహర్షీ! యతి మరణించిన తరువాత పదకొండవ దినము రాగానే చేయదగిన కర్మకాండను గురించి శాస్త్రములలో చెప్పబడినది. నీయందలి ప్రేమచే దానిని నీకు చెప్పెదను (1). వేదికను తుడిచి అలికి, పశ్చిమమునుండి మొదలిడి తూర్పు వరకు వరుసగా

పుణ్యాహవాచనమంత్రములతో అయిదు సార్లు నీళ్లను చల్లి (2), ఉత్తరాభిముఖముగా కూర్చుండి స్వయముగా మండలములను చేయవలెను మధ్యలో పదునెనిమిది జానల చతురస్రమును గీయవలెను (3). బిందువు, త్రికోణము, షట్కోణము మరియు వృత్తము అనే ఆకారములను క్రమముగా గీసి, పూజావిధానములో చెప్పిన పద్ధతిలో శంఖమును ముందు ఉంచవలెను (4). ప్రాణాయామమును చేసి, సంకల్పమును చేసి, దేవతలపై ఆధిపత్యము గల పూర్వమునందు చెప్పబడిన అయిదుగురు అతివాహిక (పుణ్యజీవులను స్వర్గాదిలోకములకు గొనిపోయే) దేవతామూర్తులను పూజించవలెను (5). ఉత్తరదిక్కునందు దర్భలను విడిచి పెట్టి నీటిని స్పృశించవలెను. పశ్చిమదిక్కునందు మొదలిడి తూర్పు దిక్కు వరకు గల మండలముల మధ్యలో పీఠాకారములో పుష్పములనుంచి, ఓం హ్రీం అని పలికి, అగ్ని రూపాం తామతివాహికదేవతామావాయామి నమః (అగ్నిస్వరూపిణియగు ఆ అతివాహికదేవతను నేను ఆవాహన చేసి నమస్కరించుచున్నాను) అని సర్వత్రా భావన చేయవలెను. ప్రతి మండలమువద్ద స్థాపనము మొదలగు ముద్రలను ప్రదర్శించవలెను (6-8).

హ్రాం హ్రీమిత్యాదినా కుర్యాదాసామంగాని చ క్రమాత్ |
పాశాంకుశాభయాభీష్టపాణిచంద్రోపలప్రభాః || 9

రక్తాంగులీయకచ్ఛాయరంజితాఖిలదిఙ్ముఖాః | రక్తాంబరధరా
హస్తపదపంకజశోభితాః || 10

త్రినేత్రోల్లాసివదనపూర్ణచంద్రమనోహరాః |
మాణిక్యముకుటోద్భాసిచంద్రలేఖావతంసితాః || 11

కుండలామృష్టగండాశ్చ పీనోన్నతపయోధరాః |
హారకేయూరకటకకాంచీదామమనోహరాః || 12

తనుమధ్యాః పృథుశ్రోణ్యో రక్తదివ్యాంబరావృతాః |
మాణిక్యమయమంజీరసింజత్పదసరోరుహాః|

పాదాంగులీయకశ్రేణీర్మంజులాతిమనోహరాః || 13

అనుగ్రహేణ ముర్తేన శివవత్కిం న సాధ్యతే | తస్మాచ్చక్త్యాత్మమూర్తేన సర్వం సాధ్యం మహేశవత్ || 14

సర్వానుగ్రహకర్త్రైవ స్వీకృతాః పంచ మూర్తయః | సర్వకార్యకరా దివ్యాః పరానుగ్రహతత్పరాః || 15

ఏవం ధ్యాత్వా తు తాస్సర్వా అను గ్రహపరాశ్శివాః | పాదయోః పాద్యమేతాసాం దద్యాచ్ఛంఖోదబిందుభిః || 16

హస్తేష్వాచమనీయం చ మౌలిష్వర్ఘ్యం ప్రదాపయేత్ | శంఖోదబిందుభిస్తాసాం స్నానకర్మ చ భావయేత్ || 17

రక్తాంబరాణి దివ్యాని సోత్తరీయాణి దాపయేత్ | ముకుటాదీన్యనర్ఘ్యాణి దద్యాదాభరణాని చ || 18

సువాసితం చ శ్రీఖండమక్షతాంశ్చాతిశోభనాన్ | సురభీణి మనోజ్ఞాని కుసుమాని చ దాపయేత్ || 19

హ్రాం హ్రీం మొదలగు బీజాక్షరములతో ఈ దేవతల అంగన్యాసమును వరుసగా చేయవలెను. చేతులయందు పాశము, అంకుశము అభయముద్ర, వరముద్రలను దాల్చినవారు, చంద్రకాంతమాణిక్యముయొక్క ప్రకాశము గలవారు (9), ఎర్రని మణులు పొదిగిన ఉంగరముల కాంతులచే ఎర్రగా చేయబడిన సర్వదిక్కులు గలవారు, ఎర్రని వస్త్రములను దాల్చినవారు, పద్మములవలె శోభిల్లు చేతులు కాళ్లు గలవారు (10), మూడు నేత్రములను కలిగి పూర్ణచంద్రుని వలె మనస్సునకు ఆహ్లాదమును కలిగించు ముఖములు గలవారు, మాణిక్యములను పొదిగిన కిరీటములతో ప్రకాశించువారు, చంద్రవంకయే శిరోభూషణముగా

గలవారు (11), కుండలములచే స్పృశించబడే చెక్కిళ్లు గలవారు, సుందరమగు వక్షఃస్థలములు గలవారు, హారములు కేయూరములు హస్తాభరణములు బంగరు మొలత్రాడు అనే ఆభరణములచే మనస్సునకు ఆహ్లాదమును కలిగించువారు (12), సన్నని నడుము విశాలమగు జఘనము గలవారు, ఎర్రని దివ్యమగు కోకలను దాల్చినవారు, మాణిక్యములను పొదిగిన నూపురములతో చిరు శబ్దమును చేయు పద్మములవంటి పాదములు గలవారు, పాదములయందు వ్రేళ్లకు గల అందమైన అంగుళీయకములతో మిక్కిలి మనోహరముగా నున్నవారు అగు ఆ దేవతలను ధ్యానించవలెను (13). అనుగ్రహ స్వరూపిణి యగు ఆ దేవతకు శివునకు వలె ఏది సాధ్యము కాదు ? కావున, శక్తిస్వరూపిణియగు దేవతామూర్తి మహేశ్వరునివలె సర్వమును సాధించిపెట్టును (14). సర్వకార్యములను చేయునవి, గొప్ప అనుగ్రహమునందు నిమగ్నమైనవి అగు ఈ దేవతామూర్తులను సర్వానుగ్రహములనిచ్చు శివుడ స్వీకరించినాడు (15). అనుగ్రహమును చేయుటలో తత్పరమైనవి, మంగళకరమైనవి అగు ఆ దేవతామూర్తులనందరినీ ఈ విధముగా ధ్యానించి, వారికి శంఖములోని జలముతో పాదములకు పాద్యమును ఈయవలెను(16). శంఖములోని నీటితో వారికి చేతులకు అర్ఘ్యమును, ఆచమనీయమును ఇచ్చి, శిరస్సులపై అభిషేకమును మానసికముగా చేయవలెను (17). వారికి ఉత్తరీయముతో కూడిన ఎర్రని వస్త్రములను సమర్పించవలెను. కిరీటము మొదలగు విలువైన ఆభరణములను కూడ ఈయవలెను (18). పరిమళములను వెదజల్లే గంధపు చెక్కను, మిక్కిలి శోభను చేకూర్చే అక్షతలను, పరమళము గలవి సుందరమైనవి అగు పుష్పములను కూడ సమర్పించవలెను (19).

ధూపం చ పరమామోదం సాజ్యవర్తి చ దీపకమ్ | సర్వం
సమర్పయామీతి ప్రణవం హ్రీముపక్రమాత్ ||20

నమో%ంతం చతతో దద్యాత్పాయసం మధునాప్లుతమ్ |
సాజ్యశర్కరయా%పూపకదలీగుడపూరితమ్ || 21

ప్రత్యేకం కదలీపత్రే భరితం చ సు వాసితమ్ | భూర్భువస్స్వరితి ప్రోచ్య ప్రోక్షణాదీని కారయేత్ || 22

ఓం హ్రీమితిసముచ్చార్య నైవేద్యం వహ్నిజాయయా | పానీయం నమ ఇత్యుక్త్వా పరం ప్రేష్ణా సమర్పయేత్ || 23

తత ఉద్వాసయేత్ర్పీ త్యా పూర్వతో మునిసత్తమ | స్థలం విశోధ్య గండూషాచమనార్ఘ్యాణి దాపయేత్ || 24

తాంబూలం ధూపదీపౌ చ ప్రదక్షిణనమస్కృతీ | విధాయ ప్రార్థయేదేతాశ్శిరస్యంజలిమాదరాత్ || 25

శ్రీమాతరస్సుప్రసన్నా యతిం శివపదైషిణమ్ | రక్షణీయం ప్రబ్రువంతు పరమేశపదాబ్జయోః || 26

ఇతి సంప్రార్థ్య తాస్సర్వా విసృజ్య చ యథాగతమ్ | తాసాం ప్రసాదముద్ధృత్య కన్యకాభ్యః ప్రదాపయేత్ || 27

గోభ్యోవా జలమధ్యే వా నిక్షిపేన్నాన్యథా క్వచిత్ | అత్రైవ పార్వణం కుర్యాన్నైకోద్దిష్టం యతేః క్వచిత్ || 28

అత్రాయం పార్వణశ్రాద్ధే నియమః ప్రోచ్యతే మయా | తం శృణుష్వ మునిశ్రేష్ఠ యేన శ్రేయో భ##వేత్తతః || 29

కర్తా స్నాత్వా ధృతప్రాణ ఉపవీతి సమాహితః | సపవిత్రకరస్త్వస్యాం పుణ్యతిథ్యామితి బ్రువన్ || 30

కరిష్యే పార్వణం శ్రాద్ధమితి సంకల్ప్య చోత్తరే | దద్యాద్ధర్భానుత్తమాంశ్చ హ్యాసనార్థం జలం స్పృశేత్ || 31

తత్రోపవేశ##యేద్భక్త్యా సాభ్యంగం కృతమజ్జనాన్ | ఆహూయ చతురో విప్రాంశ్శివభక్తాన్ దృఢవ్రతాన్ || 32

ఓం హ్రీం సర్వం సమర్పయామి నమః (సర్వమును సమర్పించుచున్నాను; నమస్కారమగుగాక!) అని పలికి, చక్కని సుగంధము గల ధూపమును, నేతిలో తడిపిన వత్తితో దీపమును సమర్పించవలెను. తరువాత తేనెతో చేసిన పాయసమును సమర్పించవలెను. నెయ్యి, పంచదార, అప్పములు, అరటిపళ్లు, బెల్లము మరియు సుగంధద్రవ్యములు అను వాటితో కూడిన నైవేద్యమును ప్రతిఒక్కదేవతకు ఒక్కొక్క అరటి ఆకులో నింపి, భూర్భువస్సువః అని పలికి, నీటిని చల్లుట మొదలగు విధులను పూర్తి చేయవలెను (20-22). ఓం హ్రీం స్వాహా అని పలికి నైవేద్యమునిడవలెను. తరువాత నమః (నమస్కారమగుగాక!) అని పలికి , శ్రేష్ఠమగు పానీయమును ప్రేమతో సమర్పించవలెను (23). ఓ మహర్షీ! తరువాత ప్రీతిపూర్వకముగా ఉద్వాసన (దేవతలను సాగనంపుట) ను చెప్పవలెను. తూర్పువైపున మొదలిడి ఆ స్థలమును శుద్ధి చేసి, ఉత్తరాపోశనము, హస్తప్రక్షాళనము మరియు ఆచమనము అనువాటి కొరకై నీటిని ఈయవలెను (24). తాంబూలమును, ధూపదీపములను, ప్రదక్షిణనమస్కారములను, సమర్పించి, శిరస్సుపై చేతులను జోడించి, ఈ దేవతలను ప్రార్థించవలెను (25). పూజ్యులైన ఓ తల్లులారా! మీరు అనుగ్రహము గలవారై, శివధామమును కోరే యతిని రక్షించుడు. పరమేశ్వరుని పాదపద్మముల వద్ద ఈతని గురించి మీరు చెప్పెదరు గాక! (26) ఈ విధముగా ప్రార్థించి, ఆ దేవతలనందరినీ వచ్చిన దారిన సాగనంపి , వారి ప్రసాదమును పైకి తీసి, కన్యకలకు ఈయవలెను (27). లేదా, గోవునకు పెట్టవలెను. లేదా, నీటిలో విడిచిపెట్టవలెను. ఎట్టి పరిస్థితులలోనైననూ మరియొక విధముగా దానిని వినియోగించరాదు. సన్న్యాసికి ఈ విధమగు పార్వణకర్మయే గాని, ఏకోద్దిష్టశ్రాద్ధము (ఒక విశిష్టజీవుని ఉద్దేశించి చేసే శ్రాద్ధము) ఏ కాలమునందైననూ తగదు (28). ఈ విధమగు పార్వణశ్రాద్ధములోని నియమములను నేను చెప్పెదను. ఓ మహర్షీ! నీవు వినుము. దీని వలన శ్రేయస్సు కలుగును (29). ఈ కర్మను చేయు వ్యక్తి స్నానమును చేసి, ఏకాగ్రమగు మనస్సుతో ప్రాణాయామమును చేసి, యజ్ఞోపవీతమును

ధరించి, దర్భతో చేసిన పవిత్రమును చేతియందు ధరించి, అస్యాం పుణ్యతిథ్యాం పార్వణం శ్రాద్ధం కరిష్యే (ఈ పుణ్యతిథినాడు పర్వమునాడు చేసే శ్రాద్ధమును చేసెదను) అని సంకల్పించి, ఉత్తరదిక్కునందు మంచి దర్భలను ఆసనము కొరకై సమర్పించి నీటిని స్పృశించవలెను (30, 31). శివభక్తులు, దృఢమగు వ్రతము గలవారు, అభ్యంగనస్నానమును చేసినవారు అగు నలుగురు బ్రాహ్మణులను భక్తితో ఆహ్వానించి , అక్కడ కూర్చుండబెట్టవలెను (32).

విశ్వేదేవార్థం భవతా ప్రసాదః క్రియతామితి | ఆత్మనే భవతా
పశ్చాదంతరాత్మన ఇత్యపి || 33

పరమాత్మన ఇత్యేవం ప్రోచ్య ప్రార్థ్య చ తాన్ యతిః | శ్రద్ధయా
వరణం తేషాం కుర్యాద్యాథార్థ్యమాదరాత్ || 34

పాదౌ ప్రక్షాల్యతేషాం తు ప్రాఙ్ముఖానుపవేశ్య చ |
గంధాదిభిరలంకృత్యో భోజయేచ్చ శివాగ్రతః || 35

గోమయేనోపలిప్యాత్ర దర్భాన్ ప్రాగగ్రకల్పితాన్ | ఆస్తీర్య
సంయతప్రాణః పిండానాం చ ప్రదానకమ్ || 36

కరిష్య ఇతి సంకల్ప్య మండలత్రయమర్చ్య చ |
ఆత్మానమంతరాత్మానం పరమాత్మానమప్యతః || 37

చతుర్థ్యంతం వదన్ పశ్చాదిమం పిండమితీరయన్ | దదామీతి చ
సంప్రోచ్య దద్యాత్పిండాన్ స్వభక్తితః || 38

కుశోదకం తతో దద్యాద్యథావిధి విధానతః | తత ఉత్థాప్య వై
కుర్యాత్ర్ప దక్షిణనమస్కృతీ || 39

తతో దత్త్వా బ్రాహ్మణ   భ్యో దక్షిణాం చ యథావిధి | నారాయణబలిం
కుర్యాత్తస్మిన్నేవ స్థలే దినే || 40

రక్షార్థమేవ సర్వత్ర విష్ణోః పూజావిధిస్స్మృతః |
కుర్యాద్విష్ణోర్మహాపూజాం పాయసాన్నం నివేదయేత్ || 41

ద్వాదశాథ సమాహూయ బ్రాహ్మణాన్ వేదపారగాన్ |
కేశవాదిభిరభ్యర్చ్య గంధపుష్పాక్షతాదిభిః || 42

ఉపానచ్ఛత్రవస్త్రాది దత్త్వా తేభ్యో యథావిధి | సంతోషయేన్మహాభక్త్యా
వివిధైర్వచనైశ్శుభైః || 43

ఆస్తీర్య దర్భాన్ పూర్వాగ్రాన్ భూస్స్వాహా చ భువస్సువః | ప్రణవాది
ప్రోచ్య భూమౌ పాయసాన్నం బలిం హరేత్ || 44

ఏకాదశాహసువిధిర్మయా ప్రోక్తో మునీశ్వర | ద్వాదశాహవిధిం వక్ష్యే
శృణుష్వాదరతో ద్విజ || 45

ఇతి శ్రీ శివమహాపురాణ కైలాససంహితాయాం
యతీనామేకాదశాహకృత్య వర్ణనం నామ ద్వావింశోఽధ్యాయః (22).

మీరు విశ్వే దేవతల కొరకై ఇచట శ్రాద్ధమును గ్రహించి అనుగ్రహించెదరు గాక! ఆత్మనే అంతరాత్మనే పరమాత్మనే (ఆత్మ, అంతరాత్మ మరియు పరమాత్మ కొరకు) భవతా ప్రసాదః క్రియతామ్ (మీరు శ్రాద్ధమును గ్రహించి అనుగ్రహించెదరు గాక!) అని పలికి, కర్మను చేయు ఆ యతి వారిని ప్రార్థించి, వారిని యథావిధిగా శ్రద్ధతో ఆదరముతో వరణము చేయవలెను (33, 34). వారి పాదములను కడిగి, వారిని తుర్పుముఖముగా కూర్చుండబెట్టి, గంధము మొదలగు వాటితో అలంకరించి, శివుని యెదుట వారిని భుజింపజేయ వలెను (35). ఆ స్థానమును గోమయముతో అలికి, తూర్పు వైపు కొనలు ఉండునట్లుగా దర్భలను పరచి, ప్రాణాయామమును చేసి, పిండానాం ప్రదానకం కరిష్యే (పిండములనుసమర్పించెదను) అని సంకల్పించి, మూడు మండలములను, ఆత్మను అంతరాత్మను మరియు పరమాత్మను పూజించి (36, 37), ఆత్మనే అంతరాత్మనే పరమాత్మనే ఇమం పిండం దదామి (ఆత్మ అంతరాత్మ పరమాత్మల

కొరకు ఈ పిండమునిచ్చుచున్నాను) అని పలుకుతూ పిండములను భక్తితో సమర్పించవలెను (38). తరువాత యథావిధిగా దర్భజలమును ఇచచ్చి, వారు లేచి నిలబడిన తరువాత ప్రదక్షిణము ఏసి నమస్కరించవలెను (39). తరువాత యథావిధిగా బ్రాహ్మణులకు దక్షిణనిచ్చి, అదే స్థలములో అదే రోజున నారాయణబలి (నారాయణునకు నైవేద్యమునిడుట) ని ఈయవలెను (40). సర్వదేశములలో మరియు కాలములలో రక్షణను పొందుట కొరకై విష్ణువును పూజించవలెనని మహర్షులు చెప్పుచున్నారు. కావున, విష్ణువును ఉద్దేశించి మహాపూజను చేసి పాయసాన్నమును నైవేద్యము పెట్టవలెను (41). తరువాత వేదవేత్తలైన పన్నెండు మంది బ్రాహ్మణులను ఆహ్వానించి, కేశవనామములతో గంధమును పుష్పములను మరియు అక్షతలను సమర్పించి పూజించి (42), చెప్పులు గొడుగు మరియు వస్త్రములు మొదలగు వాటిని వారికి యథావిధిగా సమర్పించి, మహాభక్తితో అనేకములగు మధురవచనములను పలికి వారిని సంతోషపెట్టవలెను (43). తూర్పు వైపు కొనలు ఉండునట్లుగా దర్భలను పరచి, ఓం భూస్స్వాహా, ఓం భువస్స్వాహా, ఓం సువస్స్వాహా అని పఠించి, నేలపై పాయసాన్నమును బలి (ఆహారము) గా ఈయవలెను (44). ఓ మహర్షీ! పదకొండవనాడు చేయదగిన పవిత్రమగు విధిని గురించి నేను నీకు చెప్పియున్నాను. ఓబ్రాహ్మణా! పన్నెండవ నాడు చేయదగిన విధిని గురించి చెప్పెదను. ఆదరముతో వినుము.(45).

శ్రీ శివమహాపురాణములోని కైలాససంహితయందు సన్న్యాసికి పదకొండవనాడు చేయదగిన కృత్యములను వర్ణించే ఇరువది రెండవ అధ్యాయము ముగిసినది (22).